# ఆహ్వానము.



కిలారి ! పద ! మన
జనపదములకు—
పొలానఁబాటలు
"ఖులాస" కద—చిన
అరంటి తోటకు
తలంటుకొనిరా.
"చలాకి" పాలికా
పు—లోతు నూతిని
ఒయారి యేతఁపు
టుయాలి గూనను
బుడుంగు ముంచుచు
[illegible]ల సిరము
కరాల నెత్తుచు
బుళుక్కు వంచుచు
తడిన్ బదనులిడు
సడిన్ బయిన్ నడ
గడన్ గడన్ వడి
తటేంబడక చను
"గడింబిడిన్" మన
నుడిన్ గొలుపఁదగు
కిలారి ! పద ! మన.
జనపదములకు—



౨౭౩౦

# కోంత్ర పాటు.

## గీతిక. 1.

" ముప్పావులాం కూలొస్తాది
నాయప్పరాము
కోతలోకి కూలి కెళదాము
కూనుకుంటె కూడొస్తాగా
నాయప్పరాము
కోతలోకి కూలికెళదాము." 6

బందరద్దకంచు - చీర
అందముగను - కట్టుకోని
కంచసంచు - కత్తికటు
కుదురుగ మెడ "సదురు" కోని
దారి తంగేడుపువ్వు
తలను బిద్దె పెట్టుకోని
కులుకుమోమునందు - కలికి!
కుంకుమ బొట్టుద్దుకోని
కోతలోకి కూలికెడదాము
నాయప్పరాము
కోతలోకి కూలికెళదాము. 17

చలిదిముంత కలిపెను గంతో
నెత్తి ద్రోణకుండ సిలిపి
కోడవలి పిడినొంపు గొలిపి
అంచుల జుఱ్ఱగట్టి మాలిపి
తోడి వాండ్రితోడు కలిపి
' కోంతలోకి కూలి కెడదాము
నాయప్ప రామొ
కోంతలోకి కూలి కెడదాము.'

చిన్ని చిన్ని మంచుబొట్లు
సన్నవరిమళ్లు మీద
మాపుపిల్లితెప్పు రాలెను
మొన్న బట్టిన గాలివాన
మున్గినట్టి మకాకుచేలు
నిన్న మొన్న చేసినట్టి
కొండగాలి కొఱపోయెను
తెరవుమఱిగి - పెరవు లెఱిగి
పఱిగపిట్ట బాగు లేగె
బేగి లెగిసో
'యప్ప రామొ
కోంతలోకి కూలి కెడదాము.
నాయప్ప రామొ
కోంతలోకి కూలి కెడదాము.'

# బల్లకట్టు.

## గీతిక. 2.

ఈవ లొడ్డుకు - పట్టు
ఆవలి బల్లకట్టు -
పొలములో నాబావ
తలపోయు చుంటాఁడు.
మద్దాన్న మైనాది.
పొద్దుమీఁగున్నాది.
వెచ్చ నన్నముకూర
పచ్చడి తలమోఁతో.
కష్టపడ్డాఁడు కాఁడు.
కోప్పడుతూ ఉంటాఁడు
గున్నమామిడికింద
నన్నుంచు కొనుచుంటాఁడు.
దాఁటిపోయేవారు
ఏ రోజు, ఉంటారు ;
ఊరిలోనిదాన
ఈ రోజె మహరాజ !
ఈవలొడ్డుకుపట్టు
ఆవలిబల్లకట్టు.



తూర్పు విప్పరుస్,
స్ఫురణ.

గడిన,
13-12-1922.

# ఎఱ్ఱ ఎఱ్ఱని సంజ.

## గీతిక. 3

ఎఱ్ఱ ఎఱ్ఱని సంజ
నల్ల నల్లని పిల్ల
పచ్చ పచ్చని గడ్డి
కోయుచుండెగా.
చేను.
మేయుచుండెగా.
కాపు
కాయుచుండెగా. 8

చూపులొడ్డని సొగసి
పాపమొల్లని పడుచు
పాపటొత్తని బాల
చాటునొదిగెగా
దొంగ.
మాటు వణగెగా
చెలి–
పాటు పడలెగా. 16

తలకుఁ జుట్టిన పాగ
మొలకుఁ గట్టిన పంచె
కాళ్ళ పెట్టిన జోడు
సర్దుకొంచున్
రైతు
దిద్దుకొంచున్
పెద్ద
సద్దు చేసెన్. 24

ఇట్టు కొడవలిఁ గోసి
పట్టెడా నెతదూసి
గట్టు మీదను నేసి
కెనరో పదక
లదురు
బెదురు లేక-
ఎదురు
పడరె పోక ? 32

'తురక బొంబయి రైక
నీలియంచుల కోక
మాయ యందెల రాక
రామ చిలుక
ఇదిగో
పరకలనియెడ'
ఎంకు
దొరక రెవరురా. 56

---

రాజమహేంద్రవరము,
స్ఫురణ.

రచన,
26-6-1921.

సఖులు నడికట్టొడియ నెట్టుచు
వీడు సిగముడి వ్రేళ్లఁ బెనచుచు
అలినటులు వోనడుగు నాపుచు
వలపుఁజిమ్మెడు పదముగలుపేమో ?
ఏమో—
పదముకదప పొదరింటినిలుపేమో ? 18
ఎదుటకుఱ్ఱది యేదిలేదు
మోహపమటకు - ప్రొద్దు కాదు
మఱుగుఁబెట్టగ మఱపురాదు
కూలియన్నల కుతుకమదియేమో ?
ఏమో—
బాలికలపని పెరిమయదియేమో ? 24

రాజమహేంద్రవరము,
స్ఫురణం.

రచన,
25-6-21.

# వరహాలరాజా.

గీతిక. 5.

కళ్లములో చూచితివో — వరహాలరాజా!
కాటుక కళ్లనియంటూ — వరహాలరాజా!
వట్టిగడ్డి మోపెత్తితివో — వరహాలరాజా!
పట్టెడ మెడపెఱిగించి — వరహాలరాజా!
బంగారు పాయాలు — వరహాలరాజా!
చెంగున నేర్చిమ్మాయి — వరహాలరాజా!
వడ్ల గింజలం తేసి — వరహాలరాజా!
వడ్ల పొల్లుగలిసాయి — వరహాలరాజా!
చేటనెత్తి చెరిగితినో — వరహాలరాజా!
చేతఁబోసి లెక్కించితి — వరహాలరాజా!
రెండుపదులు ఇరవై — వరహాలరాజా!
మూడుపదులు ముప్పై — వరహాలరాజా!
నాల్గుపదులు నలభై — వరహాలరాజా!
అయిదుపదులు ఏభై — వరహాలరాజా!
ఆరుపదులు అరవై — వరహాలరాజా!
పయట చివర గట్టిగను — వరహాలరాజా!
మూట గట్టుకొన్నాను — వరహాలరాజా!
మూటగట్టుకొని నేను — వరహాలరాజా!
మోపునెత్తుకొన్నాను — వరహాలరాజా!
దిస్సమెడను జూచింది — వరహాలరాజా!
కన్నమంది నాయత్త — వరహాలరాజా!
చెంగు చూచుకొన్నాను — వరహాలరాజా!
దొంగవీవ అన్నాను — వరహాలరాజా! 23

# రంగం నుంచి

## గీతిక. 6.

రంగంనుంచి వచ్చిన రంగని రంగులు విన్నారా ?
రంగని పెళ్లాం రామికున్న హంగులు గన్నారా ?
ఊదా కోటు మోకాల్మేను పెట్టి ఓడను దిచ్చాడు
రాదారి పడవెక్కి యింటికి రంగడు వచ్చాడు.
పట్టెమంచం పరుపు బిస్తరణి వచ్చింది
పుట్టిలునుండి వచ్చిన నగనె మగనికి వచ్చింది.
పచ్చని కొబ్బరితోటొక పందుం రంగడు కొన్నాడు
ఇచ్చుకువచ్చిన గుడిసొక కట్టి కాపురమున్నాడు
నల్లని రేవడి తాతలనాటిది పల్లం జేశాడు
పెళ్లాంతోడ కారెముతోడి ఆకుపోశాడు
సారువపంటను తెల్లవరిపూరి మంచిది కట్టాడు
దాళువపంటకు సన్నవరిని దండిగ పెట్టాడు
మూండ దుడికిదొరగారిని తాందోలుతుంటాడు
బేడపావల పెళ్లాంతెస్తే పెద్దగతింటాడు
కళ్ళంలో ఒకనాడు వారల కాముడు కాసెనుగ
రంగని రంగులు రామిహంగులు ఏమో వ్రాసెనుగ 16

ఊదాకోటు రంగడుదీసి యెగురపోస్తుంటె
సాదారైకచూసుక రామిచేటలందిచ్చె
పుట్టగోచి పెట్టిరంగడు రాశిచేస్తుంటె
కట్టుకో కెగగట్టుకరామి పొల్లుత్తోసేసె
చుట్టిన పాగను ముట్టుకరంగడు చెమటలోడిస్తె
పెట్టిన గాలిచుట్టును గోలుసును రామి నవరించె
బంగరు పంటవిత్తె పుసిరినిరంగడు కొలుస్తుంటె
వంగుని ఓరే చీపిరికట్టను రామివడి తుడిచె
సంజరంగుల రామి మొగము రంగడుదాస్తుంటె
ముంజె చెక్కల రామి దొంగకాముని కాసింది. 26

పెనుమంచిలి,
స్ఫురణ.

రచన,
26-5-1922.

# సంతనుండి.

## గీతిక. 7.

నడుమువంగిన ముసలివానికి
నేల-చూపుల జాలిఁగొలుపుచు
పొడుగుబాటను నడచుచుండెను.
వాసిచేఁగలకఱ్ఱ నాతఁడు
నేలనానుక లాగునడ్డికి
సుఖముగానొర్వఁగఁ గ్రిమకట్టిసుముఁగ
జబ్బసందుల సఱుకఁజొనుపుచు
ముందుబాటను ముదముగనియెను.
ఎనుఁబదేండ్లో తొంబఁదేండ్లో
ఉండునతనికి. ఉత్సవరుగే—

'ఎచటుకేగితి తాత! నీవు
ఏమఁబోతివి తాత! నీవు'
'సంత 'కెళ్లి' 'మళ్లు' 'చుంటి'
'సంతలోపల నేమికొంటివి'
'ఉప్పుకల్లు మిఱపకాయు'
అనుచునే అతఁడంతలోన
జబ్బను నిఱికించినది తా
వెలికిఁదీయుచు నేల నానుక
నేలచూపుల జాలిగొలుపుచు
పొడుగుబాటను నడచుచుండెను.

మఱలనే ‘తను’ పలుకరింపక
పోయినను నను వెంటఁ దఱుముచు
పిలుపుగొలుపుచు ‘తండ్రీ! పైఁబడె
నూటికొకటో రెండొ తప్పవ
ఎంతకాలంబిట్లు బ్రదుకుదు
ఏమిలాభంబనుచు నడిగెను’
ఏమిలాభంబనుచుఁ జెప్పుదు ?
నెంత కాలంబనుచుఁ జెప్పుదు ?
‘సంత సంతకుఁ జనుచు నీవు
సంతలోపల ఉప్పుకల్లు
మిఱపకాయయు కొనుక్కొనుచును
ఎంతకాలము సంతలుండునొ
అంతకాలము బ్రదుకుమంటిని.’ 33

పెద్దాపురం,
స్ఫురణ.

రచన,
17-9-21.

# సంకురాత్రి.

## గీతిక. 8.

సంకురాత్రి సంజవేళ - పొరుగుని మెట్టుకేగి
తిరిగివచ్చుచుండెఁ గొల్లి - పెద్దెద్దుబండివాఁడు
కొండెద్దులబండివాఁడు - మంగళారపుచేల సాంబఁడు
పల్లెనొక్క బొమ్మపైని - నాణెపు కాసుబొత్తాల్
మెఱయఁగను తవరంపు చేతుల —
తోకలను మెలిపెట్టి చల్ చల్ —
అనుచుఁ బోలుచునున్న వాఁడుగ - వీరభద్రాపురపుఁ జాయవె
బాటఘూళీ చెలఁగ - భళిరా !
జాముకొకమాటిసైమోచుచు - పిన్నవన్నెను వన్నెవాతుఁగ —
అల్లనవ్వనె అరసినాఁడను —
బండిలోపల - పిన్నపెద్దలు - పదికిపైగానున్నవారల
కందిఱుకఁ దాముందుచూచ్చిని - సాంబనిపైఁ జూడ్కి నిలుపుచు
నవ్వునకు మఱునవ్వ నవ్వును —
తొలకు కుర్చిది - కూరలంగడి - జిలగపండ్లమ్మేటి శ్యామల
వెండియొడ్డాణంబుపైపై - కుత్తికంటు పసిండిలోలో
మెఱయఁబువ్వల కొత్తకోకను - మఱియుమనా గట్టినది
ఎవ్వను —
సాంబఁడు శ్యామలయు భార్యాభర్తలని పరిజలెఱుఁగ
రిపుడో —.
మందహాసపు మధురదృష్టిని - అందఱికి వెలుకయ్యెనో హా

వీరభద్రాపురము,
స్బగణ

రచన,
30-2-1922.

# రంయి — రంయి

## గీతిక. 9.

పటిగట్టు - పెనగియున్న - ప్రాలుపొదలు - రేఁగిపోఁగ
రంయి రంయి - రవ్వ రవ్వ - చెవులు తవక కట్టినట్టు
పెద్దపెట్టు వీవఁదొడగె - క్రొత్తనీటి యీఁదగాలి.
మబ్బుమబ్బుఁగు - మసకపొద్దు - నెత్తిమీఁద నిలిచియుంట
తేరిచూడ నేరమయ్యె. 5

రేవుపడవదేవునిపఁలు - భారముంచి పయనమయ్యె.
చూప 'జంయ్యి జంయ్యి' నీట - తడిసెననగఁ దట్టువంచె.
చుక్కానిని - గాసేవాఁడు - చిక్కబట్టి - చేతికొద్ది
తన్ని పెట్టె దాఁటి కాలు - 9
మొలనువెండి బిలబిలత్రాళ్ళు - మొదలను తెగి మోసమైన
పడవనడుపు పంతమెసఁగ - పట్టునట్టె పట్టియుంచె 11

దూరమునను మబ్బులందు - చాటుచాటు చాయలందు
డొంకెనలను వంకలమర - పేదరాండ్రు వేలు వేలు
నిలిచి క్రొత్త నీటియందు - కొట్టుకొనుచు గట్టుజేరు
పుల్లపుడక ప్రోగుచేసి - గుట్టగాను గూర్చుకొనుచు
రేవు పడవ దేవునిపఁలు - భారముంచి పయనమగుట
చూచుచుండిరి చోద్యముగను. 17

వారి పనిని వారు మఱవ
వారి చేతిడొంకెనకట్టి
లట్టె నీటినంటి తేల
వారి కురులుపాయచెదఁగ
వారి చెఱఁగుపాడితప్ప
వారు చిత్రపటములల్లు
సొగసుగాను చూచిచూచి
నగిరివారు నావనెంచి 25

నావ మనిషి నవ్వునెంచి
'నా వశమా నీ వశమా ?
నవ్వేభామా ! నవ్వే పడుచా !
గోదారి యీఁదగాలే
ఎగిరిపోవునింకఁ జెఱఁగు
తోసుకుపోవు తొట్టెపడవ'
అనుచునాఁడె నానువనఁగ
ఆవలొడ్డు నావచేరె. 33

కపిలేశ్వరము,
స్ఫురణ.

రచన,
17-8-1919.

# పొలము బయలున.

గీతిక. 10.

అప్పుడె పాడిన దండపు - పాట
అప్పుడె యూడ్చిన దా కడచేతు
చఱి చఱి నడచుచు చక్కని కోన
మఱలుచువచ్చెను మైమైఁ జాన. 4

వళ్ళగట్లపై మసలిన వీఁక
నసురసంజగా నగపడు చక చక
ఎగగట్టిన చీద్దిగదియ్యకనే
విడుముడి రైకను బిగగట్టకనే
విచ్చలపిడిమై వచ్చుచునుండెను. 9

అచ్చపు - పాటాకటను కొనుచును నే
మమ్ములఁ జూచెను - ఏమిటి తోఁచెనొ
ఆలా ఆలా కొబ్బరిమాకుల
చాటున నే నడ బాటునవడి
దాటుచు దాటుచు తన వారలలో
దబ్బునఁ గలుసుక తప్పించుక చనె
పాటకు సిగ్గా? పడఁతికి సిగ్గా. 16

---

నరసాపురము,
స్ఫురణ.

రచన,
7-9-22.

# తీర్థపు "సరదా".

గీతిక. 11.

ఎందుకీ మాటివిఱుపు - ఎవరిమీదనో పడఁతి
ముందుతీర్థములోన - పూలంచు చీరకొంట
పదపద పడవెక్క - పాటువేళ తప్పనంట. ॥ఎం॥

అందగాడ! ఆలాగుననే - ఆసపెట్టి తీసికొస్తి
పాలకొల్లు సంతలోనె - నీలి చీరకొంటానంటి
నడిపించినావు నీవు - వడివడి కాల్వగట్టు ॥ఎం॥

పెరవలి 'లాకు' కాడ - తగిలె దాని ముండమొయ్య
రహదారి పెద్దపడవ - రాతిరాగు దామటంటె
కడువడి 'నమసు' నంటి - కాస్త లెక్కకేమిటంటి. ॥ఎం॥

నీటుకాడపోని కాని - మారుటేరు సత్రములో
మంచిమాటఁజేసికొనగ, మసలి నామలేద విన్న
పాత్రియ్యరాజకీ నాకళ్లు - పోయిన మాటాడవైతి ॥ఎం॥

రాతిరల్లు దాఁపొడవు - రమణి నడచి యాఁసి తేమొ
పెనుగొండ రేవుదరిని - పూటకూటి యిల్లుటంటె
కూరతేరపై యూరిలో - కూడువండి పెడుదాననవె ॥ఎం॥

వెన్నెకాడ! మాయమాట - తిరుగుజట్కా నలుగురెక్క
అయిదు నీవు ఆరు నేనని - అందులోనె ఇఱుకుమంచు
ముప్పతిప్పలు పెట్టినావు - చెప్పుకొన్న సిగ్గుసిగ్గు ॥ఎం॥ 18

సాగరాల జల్లులాట - నదిగంగస్నానమాడ
వేగువేళ వేడుకనవె - వేగబోవ వలయు నవె
రవలబండి ముపలగుట్రం - చిటికవోవ తలపుగొనవె. ॥ఎం॥ 21

సొగసుకాడ! నన్నుచూడు - ఆ వలంతర్వేదిచూడు
పోటువేళ - తొట్టెపడవ గాటుబొట్టు నేటిపెండ్లి
తొట్టెపడవ వద్దు వద్దు - గట్టికూత కూసెనదియో. ॥ఎం॥ 24

కూతవిన్న గుండెబెదురు - కదలుచున్న కంటికదురు
నావమాటలాడినాను - నాసెముగ తెరచాపవోవు
తప్పదూ చీకటినిత్రెస్తు - వెలుగుచాయనుండువస్తు ॥ఎం॥ 27

ఓడనెక్క చీరలేదు - నావనెక్క నేవలేదు
తీర్థమున కీ తీరువచ్చు - తెఱవల నవవలెనుగాక !
వెలుగుచాయ బైటజాఱ - వెన్నెలనవ్వేదవరాజ ! ॥ఎం॥ 30

---

నరసాపురం,
స్ఫురణ.

రచన,
19-5-1923.

# ఏమంటవ్రా నీవు రానంటవా?

గి ని క. 12.

ఏమంటవ్రా నీవు రానంటవా ?

ఓడతెడ్డు గూడతోడు - ఒక్కలాగు చక్కనౌను

రాజుకోట నిమ్మతోట - ఒక్కలాగు చల్లగుండు

ఏమంటవ్రా నీవు రానంటవా ?

ఓడెక్కి 'రంగ మెల్లి' పోతనంటవా ?

గూడచేతఁ బుచ్చుకోని గునుస్తునంటవా ?

రాజుతోడ 'రాజ మంద్రిం' చూస్తునంటవా ?

నిమ్మచెట్టు నీడపట్టు నిలుస్తునంటవా ? 8

ఏమంటవ్రా నీవు రానంటవా ?

కాసుమాడ కోడెదూడ - ఒక్కలాంటి బేరమేను

సంజమాయ ముంజకాయ - ఒక్కలాంటి సారమేను

ఏమంటవ్రా నీవు రానంటవా ?

కాసుజూసి కట్టకమునకుఁ గదలిపోతవా ?

కోడెదూడ తోలుకొంటు సంతకొస్తవా ?

సంజపొద్దు చన్నపట్నం సాగి పోతవా

ముంజకాయ తింటుకల్లు లొట్టి

ఏమంటప్రా నీవు రానంటవా ?

తెల్లమల్లె మబ్బుజల్లు - ఒక్కలాగె చలువసేయు
సైనుతాను కోతచేను - ఒక్కలాగె ఒళ్ళుమూయు

ఏమంటప్రా నీవు రానంటవా ?

తెల్లమల్లెగట్టుకోని దేశమెడ్తవా
మబ్బుజల్లు మలుపుకుంటు - మంచిగుంటవా
సైనుతానుచింపుకోని సీమకెళ్తవా
కోతచేను కోసుకుంటు కులుకులాడ్తవా. 24

ఏమంటప్రా నీవు రానంటవా ?

పిల్లపొగరు చింతచిగురు - ఒక్కలాగు పుల్లగుండు
మేనబావ చందమామ - ఒక్కలాగు మేళవించు

ఏమంటప్రా నీవు రానంటవా ?

పిల్ల ! ఒంటి విజయనగరం లెగిసి పోతవా ?
చింతచిగురుపప్పుకూడుసిముడ పెడ్తతా.
చందమామగారి యూరు చక్కపోతవా ?
మేనబావతోడ నీవు మేల మాడ్తవా ? 32

రచన,
27-5-22.

# ఒక వేసంగి యపరాహ్ణమున.

గీ తి క. 13.

రావియాకులంతరాళ మందాడే గాలిలేదో
రావిచెట్టు క్రొత్తచిగురు రవములింక నేరలేదో
భావమెల్ల రావికింద నీడపట్టు పట్టియుండె
నీడచలనమందె మనము నేర్పుజొచ్చె గాన రవము
నీడల నెడునక్కఱ ములఁగూడఁ బలుకుకొనుచుఁ బాట
తీయములను లోకమునకు దివ్యామృత మట్టులిడునో,
కోకిల మొకటుండియుండి కోనముఖరితంబుగాగ
కో కో యని కూయుచుండెఁ గొమ్మలనడి సన్నమోవి.
'లే లే లోడురుచ్చి' యనుచు, లేఁగదూఁడ వెంటఁబలెను
స్వేచ్ఛదిరుగు నాలపోతు వెంటనుండ్రి బలురాట.
మందుటెండ మిసిమిమబ్బ మై మఱపుల నప్పటపుడు
నిండుచూపులకును నుంత నిదురదూఁగు నెమ్మి గాలిపై.
లైలమ్మయను జోలపాట లాలనములఁబల్లవెత్తి,
పాటిమట్టి తోలువారు పల్లెనదును బాడ్లదిగి
బండికొక్కఱిపవుచు పెద పెండ్లివారిఁబలెను దిగిరి
చండ తరపుటొడవేళ సన్నసన్న పాటలతో. 16

అందఱుదిగినారు కాని అందునొక పసుపుపిల్ల
ఎందు తాను నున్నదియొ మెఱుఁగనంతటి గాఢనిద్ర
వోవుచు దిగకక్కైబండి పొట్టిగదుకొయ్యనంటి
సోలియుండె సొమ్మసిల్లి చుక్కునెండ కాయుచుండె.
పాటుపడ్డప్పుడేని దాని మోటునొసటనంత చెమట
పోసియుండలేదు 'లే' 'లే' 'ఓసి' యనచుఁ గోడివాండ్రు
పాపమనక కూలివాండ్రు లేపినారు పెద్దకూఁక
నిక్కిలేచి తలనునెత్తు - నెత్తు లేదు లేవ లేదు.
పిల్లకొప్పు బండికొయ్యఁ బెనచికట్టి బండితోలు
కోడెకాడు. వాఁడెయనగ - చేడెచూచె జంకనెఱి
కోడెకాడు కొప్పువిప్పె - కొప్పువిప్పి కొసరిపలికె
'కట్టె నెవడొ కలనుజుట్టు - తట్టనెత్తుకొత్వరగ వచ్చి'
వన్నెకాని మాటనిజమొ - స్వప్నసమ్మోహనంపు
వేసఁగి యపరాహ్ణమదియ 30

పెనుమంచిలి, రచన,
స్ఫురణ. 13-6-1922.

# ఎక్కడున్నావో లె.

## గీతిక. 14

"ఎక్కడున్నావో లె ! నీవు"
'అక్కడె ఆయింటిలోనె'
'ఆ అద్దాల మేడలోన ?'
పక్కన నవ్వుచుఁ బిల్ల
పిక్క సందులోని కరిగె
టక్కరి ఆ కోడెకాడొ
చక్కఁ బోయె రాజుబాట
అద్దాల మేడ యేంటొ ?
ముద్దరాలి జాడలేంటొ ? —
కప్పతూట్లు వడ్డగుడిసె
నుప్పు లేని కూడుకుడిచె
తప్పతాగి వాఁడువచ్చె
తొప్పతల పసందు మెచ్చె. 13

నరసాపురము, రచన,

స్ఫురణ. 16-3-1924.

# గొల్లవాఁడ! పిల్లవాఁడ!

## గీతిక. 15.

"గొల్లవాఁడ! పిల్లవాఁడ! గొల్లకడల కుఱ్ఱవాఁడ!
'గోదారి' లోనఁగడుగ నీయొడలి ధూళియేడ?
గోళి కాయలాడినావ? గూటిబిళ్లలాడినావ?
కోతి 'కొమచు' లాడినావ? గొల్లనెల్ల విడచియిచ్చ
చీమచింత చెట్లక్రింద - చెలఁగియాశీచల రేగి"
గోదారిలోన ఈఁతాలాడు కొనుచునుంటివటర? 6
"కాపుగారు! కన్నదొరలు! కాదు కాదు లేదు లేదు
గోళికాయలాడ్డలేదు గూటిబిళ్ల మీఁటలేదు
కోతికొమచి దుముక లేదు గొల్లనెంచ విడువ లేదు
గొల్లనేను తోలునపుడు గొల్ల వెనుక నడుచునపుడు
గొల్లగిల్ల రేగినట్టి గొప్పధూళియొడలిఁ గప్పె
'గోదారి' నిపుడె దిగితి గొల్లవె! యవె! యవే! ఁచవే!

రాజమహేంద్రవరము, రచన,
స్ఫురణ. 14-3-1922.

# "రస్తా" "మరమత్తు".

## గీతిక. 16.

బండ్లుదిగి నడవండి వీటికి

గుండ్లపైఁబడకండి నేటికి॥

రహదారి ఎగుడు దిగుడులు - మహారాజుల మరలబండ్లకు
ననువుగను జేసేము మేము - ఇనుప తిరుగుడు గుండ్లను ॥బం॥
ధూళిదుమ్మును నెత్తిమోసిన - తోడబుట్టుల మన్నలారా
రాళ్లనీళ్లను కలిపి మొత్తిన - కూలిపడుచుల మక్కలారా॥బం
గున్నపొన్నలు తీయమావులు - కూళ్లు తినుమా చలువతావులు
దారిప్రక్కనె చనెడు కాలువ - దప్పికార్చెడు కామధేనువ॥బం॥
ఎఱ్ఱదీపము నల్లబల్ల - యెఱుకవారికిల హద్దులోపల
పెద్దమోకులులాగుకొనుచును - సుద్దులాడుచుఁబాడుకొందుము॥
ఎవ్వరైనను జాటసారులొ అవ్వలకు నొత్తిల్లియుండుడు
మాటమొగమోటమ్ము లేదిట - మట్టిఁగంకర తగులు కాలికి॥
పొద్దుపొడుపునవచ్చువారము-పొద్దుపొడుగున లాగువారము
పొద్దుకుంకునబోవువారము-అద్దిరా! అదెమార్గమనుకొన॥బం॥

నరసాపురము, — రచన,

స్ఫురణ. — 16-1-1923.

# తొందఱపడెదేలా?

గీతిక. 17.

తొందఱపడెదేలా? (ఓలే! ఏ ఏ ఏ)
సందెలపడలేదే? ॥
బందను ఆ కూడ్వ (అయ్యా! ఆ ఆ ఆ)
అందెలు బాడమ్యె ॥
ముందఱకాలువను (ఓలే! ఏ ఏ ఏ)
చందురుతెలి నీరే ॥
పాలికిఁజేసేని (అయ్యా! ఆ ఆ ఆ)
కూలికి రాలేదు. ॥
సాలికి నొకసారె (ఓలే! ఏ ఏ ఏ)
'పోలికి' - పొలమూడ్చు॥
దాలిని బుగ్గోసా? (అయ్యా! ఆ ఆ ఆ)
మాలను "ఒగ్గో"సా? ॥ 12

---

నరసాపురము,
స్ఫురణ.

రచన,
-11-1923

# అందఱికంటెను ముందు.

## గీతిక. 18.

అందఱికంటెను ముందు అరయుడుగాకను కొనుచు
తొందఱగను నేనచ్చితి తొలినేకువనే లేచి
సుందర సూర్యోదయ శోభా !
మందానిగానను జూపితి——
నేనువచ్చుసరికి నోహో రాణను దీపించియుంటి
నదిపైఁగల దిబ్బంపల హరితతరుపాంక్తములో
సుందరసూర్యోదయశోభా !
ఎందఱో నినుజూచి రపుడె.
పల్లెవాఁడు పొలముకాపు తలమోతను పెఱుగమ్మ
గొల్లపడుచు చలిలోనే కులుకుచు నినుజూచిరిగా
సుందరసూర్యోదయశోభా !
మందుఁడనే వారికంటె. 12

నరసాపురము, రచన,

స్ఫురణ. 2-1-1923.

# పేరులేని చిన్నిపువ్వ.

## గీతిక. 19.

పేరులేని చిన్నిపువ్వ! దారిప్రక్క చిన్నిపువ్వ!
గట్టుపొడుగు గడ్డిపచ్చ - పూసినట్టి చిన్నిపువ్వ!
వానకాలు వచ్చినట్టె - వానమబ్బు పట్టినట్టె
పూయుచుండు ముమ్మరముగ - నామది నానందమిడుదు
పేరునీకుఁ బెట్టిరెవరు - పసులకాచువాఁడా! దీని
పేరేమీ యెఱిఁగియున్న - గడ్డిపువ్వని యిష్టముగను
తనదు పనులదరికిఁ దోలు - పడవలాగు వడిగలవాని
అడుగుదునా అపుడె వానిఁ - ముందునడక ముసలసత్తి
కళ్లనెత్తి కడియమొత్తు - పెద్ద పెద్ద పిన్నపిన్న
పండితులవలనఁ దెలియ - మల్లెపువ్వ మంకెనపువ్వ
ఏ దొప్పుట్టి యిలనుగిట్టు - వట్టిపువ్వని పొఱనైతురు. 11

పేరులేని చిన్నిపువ్వ! దారిప్రక్క చిన్నిపువ్వ!
గట్టుపొడుగు గడ్డిపచ్చ - పూసినట్టి చిన్నిపువ్వ!
నీళ్లుముంచు నీలవేణి - వెనకాతలె వెళ్లివెళ్లి
నునుమెఱుఁగున జిగుఁగువన్నె - ఎఱుపు పసుపు పేరుపడఁగ
తుదిమి పేరు తోఁచదన్న—
పడఁతి తీసినైవలేదు - తడుమునంత తగులనీవు
మల్లెమొల్లొ మఱివిరజాజొ - బంతియొ చామంతియొ యని
అట్టె దువ్వినట్టి కురులఁ - జొనిఁకొనుచు పొదుపుకురుల
పువ్వునూఁకఁబుచ్చునంత - చెడునటంచు చేతపట్టి
పిరివారి పేరునడుగు - పేరులేని చిన్నిపువ్వ
-వెలయుదీవు పేరు లేక— 22

రాజమహేంద్రవరము,
స్ఫురణ.

రచన,
10-8-1919.

# విహారపు — త్రోవ.

గీతిక. 20.

విహారమున కేగునపుడు - విశ్రాంతిగొను తావు కలదు చివర
చక్కనగు చిన్నారి తావు దానిఁ - చేరుటకు దారి వరిచేలనడుమ
చేలనడుమను నడుచునపుడు - పచ్చనగు చేలరంగొప్పగువిడు
కమ్మనగు పాలవాసనలు చెలఁగు దారినేపట్టిపోవ
పంటకాలువ గట్టుతగులు - గట్టుపైఁగలవు పొదల్
వెంపలూ - బీరలూ - కందికలుగలుఫలూ

పంటకాలువ నీటఁగలవు - నిడుపులగు జమ్ముకోసలు
ముఖసోగసుపూల పసలు - చల్లచల్లని గాలికూసల్
దొంగతనముగవచ్చి తగులు - నొసలిపై చెమ్మటాఱు
నెంతయును సేదదేఱు.

రయితొకఁడు కానరాడు - కూలిపనుచైనఁ జనను
పాలికాపందుఁబోడు - ఆశ్వయుజ మాసంబులో
ఊడుపులు అయిన వెనుక - ఆ తావునందునిలువ
అత్యంత నిశ్శబ్దమై - హరితసస్యాఢ్యమునమై
కనిపించు చుట్టుపట్లు.

ముమ్మరపు టూష్పునందు - గుమ్మమన్నట్టిపాటల్
ఈ నేటిశోభనడుమ - మానితంబైన స్మృతులఁ
గొలిపివ్రాదిగొనరికొనరి - పులకితింపంగసేయు.
పైరుతలలూగుసుంత - క్రొత్త వెన్నాడుకూంత!

నరసాపురము, రచన,
స్ఫురణ. 27-9-22.

# చరణ సూచిక.

# సమాప్తి కృతి

పాడి పంట యింట
పప్పుకూడు వంటింట
నగలు నాణాలొంట
కాటుక కడకంట
మగని చేతులుచంట
నాపాట జిమ్మంట
ఓగుంట! నేనుంట.



ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః——

# గమనిక.

కొండ కొలకు వికసి తోత్పల
1 వ సంపుటము III వ పాత్రము

## కుమారకంఠము.

నా ప డ వ
బ ం తి ఆ ట
ఉడుత లుకుత
శి వా జి
పిట్టపోరు పిట్టపోరు - మున్నగునవి.
వెల. నాలుగు అణాలు



## జనపదములను.

“సమును” “రాజు”

‘ఒత్తాము’ ‘వత్తాము’ మద్దాన్నము’ ‘సంతక్లి’ మున్నగునవి ఆయాపాత్రి పరిపర్యనమును విస్పష్టముగ సూచించుటకునైయని యెఱుగునది



ఆల్బర్టు ప్రెస్, కాకినాడ. సూర్యారావుపేట, 1924.





# కలహతపము.

## ( గీతికలు. )

---

కవికొండల వేంకటరావు. బి. ఏ. బి. ఎల్.

కవి

( ) పాఠక ( )

కొండకోలంకుశికగితోత్పల శీర్షకళ

(మొదటి సంపుటము—అయిదవ పాత్రము)

రక్తాక్షి. శ్రావణ

అభినవాంధ్రి కార్యస్థాన సుప్రకాశితము.

**1924.**

 [వెల నాలుగు అణాలు

ఓమ్

ఆదిమశ్రుతి.



ప్రకాశ మానమైన

ఆకసమ్మువైపు

ఊతికొండ వెలుగు

శీతలవనిమలుగు

అపారమైన పెద్ద

అంబుధిఁ బడు పొంటె

దశ దిశ నది తిరిగి

తేట నీట వెలుగు

'ఆలా ఆలా' నిలబడు

ఆలోచన శుభదృష్టిన్

నానాభంగులు పాడి

నవరసములు వెలయు



# ఆహ్వానము.

పైరుగాలి పయనమా
ఎటనుండి యెటకో?
తేరి చూచునంత
దిఙ్మండలపుఁ గొసలో
తెలితల చిన్నారి తరగను
సెలయించిన యట్లుండు
విలసిల్లును పెందరగన్
ఇసుకతిన్నెపై మొలకన్
వెసనూచును నట్టిట్టు
అట్టే ఆకడ తోటను
చెట్టు చెట్టు నడికదలు
పాటయు నంతేసుమ్మా!
పాఠక! హృదిఁ గనుగొమ్మా!

# శుభవాక్యములు



"ఇటీవల మీచే రచింపఁబడిన పాత్రము

లున్నదయతో తెలియబరుపుడు."

17-7-1921



# చిన్ని గీతికలు.

## గీతిక. 1.

చిన్నిపువ్వు చిఱుగాలికిఁ జెలఁగియాడెనున్
పెద్ద చెట్టు పెనుగాలికి విఱిఁగి పడియెనున్.
పొడుపుటేరు తొణక తొణకరతి పోక పోయెడిన్
పొడుగుకొండ మూఁగలాగు మూల మణిగెనున్.
తేనెఁజుక్క మినుకు మినుకు పేర్మిమలినెడిన్
పగటి పొద్దు మంచు కొండ భగభగమనెడిన్.
పలికె మంచ మృదుమధురమునయిన రమ్యముల్
తెలియరారె చిన్నిగీతికలన గమ్యముల్.
ఎన్నొకాసి ఎలనగవులు, కన్నెపడుచు కనుసన్నలు
ఔర! బట్టబయలైన నతిరహస్యముల్
రారె తెలియఁ గ్రొత్తకయిత సౌమనస్యముల్.

—:o:—

స్థానం, రచన,
రాజమహేంద్రవరము. 27-[illegible]'920.

# విరిమల్లె పూలు

## గీతిక 2.

విరిమల్లె పూల పాట
తరులెల్ల మ్రోయుఁబాట.
రామయ్య చిన్నవాఁడు
రహదారి కోడెకాఁడు.
తందాన తాన పదము
దానిని గాయుముదము.
గందంపుఁ బూతలు మెడను
మందార పువ్వులు జడను

---

కుంతికిఁ గానుకఁ గోరి
కులుకుచు సాతురు బారల్
ఖలాక పాళిని బాలల్
ఫాలాల నూడ్చిన మాలల్

---

వంతకు బోవు బచ్చు
వంతసమున డబ్బిచ్చు
ఊరికి వచ్చు చుట్టము
వారికి నిచ్చెదు-కట్నము.

—:O:—

స్ఫురణ,
నరసాపురం.

రచన
4-10-22.

# కలచూపు.

## గీతిక 3.

మృతిని గన్నటువంటి ప్రియులను
బ్రదికి యున్నటువంటి ప్రియులకు
చూపగల యలచోద్యమదెగా!
ఫలము దక్కని ప్రాలు మాలికి
ఫలముజూపెడు పారమదెగా!
విరహవేదన వేగుచు వకున
కరయదగు నంజనము అదెగా!
కలను బోలినకంటి చూపొక
టిలను వేఱొకటె సంగంబోదుగ.

—;o:—

స్ఫురణ,
రాజమహేంద్రవరము.

రచన.
17-6-1920.

# గాలి వాన.

## గీతిక. 4.

ఎంత కాలమునుండి క్రిక్కిఱిసి యుంటివో
ఈనాఁడు వెలువడితివి - పెద్దగాలి- గాలివాన_గాలి.
కప్పుపైఁ గల పెంకు కాగితము పోలికను
ఎగురఁజేసితివీవు-ఇట్టిట్టె- పెద్దగాలి-గాలివాన-గాలి
చెట్ల వేళ్లకు నంట శివమెత్తి నట్టుల
ఊపి పెకలించితివి-ఉండియుండి- పెద్దగాలి-గాలివాన-గాలి
గట్టిగోడలు పడగొట్టినట్టులు గాను
కూలద్రోసితివీవు-బెల్లుబెల్లు- పెద్దగాలి-గాలివాన-గాలి
హోరుహోరుమంచు చఱకవేసిన యట్టు
మాఱుమ్రోయించితివి- మాపుతేపు- పెద్దగాలి- గాలివాన-
తుత్తునియలుగ పాఱిశెముత్యంబులోయన [గాలి-
మేఘాలఁ బఱచితివి మిన్నుమన్ను- పెద్దగాలి-గాలివాన-గాలి
చుట్టు ముట్టి పెద్దచోద్యంబు బలె నీవు
చూపుగొల్పితి వెంతో స్వైరివగుచు- పెద్దగాలి - గాలివాన-
ఆపనెవ్వరి వశము-అశ్రాంత శక్తినా [గాలి
హద్దుదాటితివీవు-అట్టె అట్టె- పెద్దగాలి-గాలివాస-గాలి

—:0:—

స్ఫురణ,
సరసాపురము.

రచన
22-11-22.

# ఒక రేయి.

## గీతిక 5.

పడవ వాండ్రు పాడేపాట - పకపకలాగు పొనుగు త్రాళ్ళ
పడవ కెక్కి భావ మొసఁగె - పడవ నడక జీవమొసఁగె।
చీకురేయిఁ జిత్రిమోయి - మబ్బుపట్టిన మసకరేయి
వాన కురియు బరువురేయి - వాలిని గొలుపుగాలి రేయి
లాంతిరొకఁడు వ్రేలఁబట్టి - మువ్వలొకఁడు ముందుగొట్టి
మూపులొంచి నడకకలిపి - సన్న త్రాడు బారుజేసి
పడవ వాండ్రు పడవలాఁగ - పడవవాండ్రు పాటపాడ ॥ప॥

తాటి బుట్టలు తలలఁగట్టి - తడియు బట్టలు పిడపవెట్టి
నడక వెచ్చనయము గొనుచు - పడవవాండ్రుపాట-పాడ ॥ప॥

గట్టు పొడుగు పాడేపాట - చినుకు చిటుకు చెలఁగేపాట
ఎదరగాలి జేరేపాట - వాలుగాలి జారేపాట
మువలరవల మ్రోయుపాట - ఊగు త్రాటనులియుపాట
చటులుచటులు పడవనడవ - నడక కొలిపె సన్నబొళుకు
బొళుకులోన మెఱపు తళుకు - మెఱసె మినుకు-మినుకు కాంతి
పడవ నున్న నాదు మనసు - చూఁటగొనుచు దారిజూపె ॥ప॥
ఎన్నరాని యింపుపాట - లేల పాడయిరులబాట
కమ్మకమ్మని కన్నెపాట - లేల మొత్త వాన మొత్త
చిన్ని పాఁటచేవ లెంచ - దుర్భరంపు జీవనాలు
నిర్భయంపు నీటుజూపె - నిబ్బరంపుఁ బాటజూపె ॥ప॥

—:0:—

స్ఫురణ
నరసాపురము కాలువ.

రచన
21-7-1922.

# దొమ్మరి ఆట.

గీతిక ౬.

దొమ్మరి వాండ్లు డోలును కొట్టె
మొగ్గను వైచి తప్పెట కొట్టె
దండను చఱచి తొడ కొట్టె
మునసబుగారు ముస్తాబయిరి
కరణముగారు 'కండువ' వైచిరి
పెత్తందార్లు పెదపాగాల
పరుగుల నిండ నలంకరించిరి
బడిలోపిల్లలు పక్కగ నిలిచిరి
కడగానుండిరి కడమ జనంబులు
కరణం గారికి శిరమును వంచి
మునసబు గారిని ముదలనడుగుచును
పెత్తందార్లకు జిత్తమటంచును
నడు వీధిని డోల్వాయించెన్.
వాలు మొగ్గ మఱి పిల్లి మంతరము
దాడెము బస్కీ బాణాసాము
కుస్తీ చడీ వస్తాదాడెన్
దొమ్మరి సానియు దుదగడ కెక్కి
గిర గిర గిర గిర గిర గిర తిరిగె
మునసబుగారి ముంజేయి కడియము
కరణంగారి కండాణంగారి ము
పెత్తందార్ల పెత్తందార్ల
దొమ్మరి వాండ్రవరదొమ్మరి ద్రవరం.

స్వీకరణ, రాజమహేంద్రవరం. రాజమహేంద్రవరం. రచన,

# దాసిగోడవ

## గీతిక 7.

ఆరి కీరి కంట్లు తోమి - గొప్పలమ్మ అనుకొనంగ
ఇంటికేగ కంటి ఎఱుని - గుప్ప కంపు కొట్టుకొనుచు
జోగులన్న సొచ్చె నిల్లు-
"ఓసి! అప్పి! ఓసి! ఓలె; ఇల్లు రాంబు! గుల్ల తేవె?
కంకణాల కనకమేదె? తీగయేదె? వేగ తేవె?
నేను ఖైదు కేగి తేను - నీకు మగని సోకు వచ్చె
అప్పలాడు ఆమీనయ్య - అరుగు మీద అరుగొనాడె
నాకు సంకెలేసితేని - నీకు మగని సోకువద్దె?
అనుచు వాడు అడిగెనాలి - చప్ప చప్పన నన్నసన్న
తీగ తీసితెర్చె నప్పు - అప్పి కెంత యద్ధి పేర్మొ
తీగపోతె పోయెగాని - మగడు దక్కెననుచు బొంగె

---

తీగయేదె యంచు నడుగ - దిన్న మెడ మఱునాడప్పి
అంట్లుతోము వారి యింట - చెప్పినదిగ అమ్మగారు!
"జూదమాట తాగుడప్ప - దన్నియున్న వాడువచ్చి
ఖైదుకెల్ల నోలె యన్న? కంగమనసు-కానుకిగ
ఇచ్చి వేసి తీర్చినాను - ఇచ్చి వేసి తీర్చినాను
అనుచు చెప్పె నప్టి. కంట - తొణకె సిగ్గు తొలగె నీరు

—:o:—

స్ఫురణ　　　　　　　　　　　　రచన

నరసాపురము.

# వెన్నెలలు.

## గీతిక 8.

తెల్లని వెన్నెలలు.
పచ్చని మొలకలను
చల్లగను నిలిచియుండె.
పచ్చని మొలకలు
తెల్లని వెన్నెలల
నుల్లసిలు చొప్పుచుండె.
తెల్లని వెన్నెలలు
పచ్చని మొలకపై
నిదురించి కలలు గనునో
పచ్చని మొలకలు
తెల్లని వెన్నెలను
నిదురించి కలలుగనునో
మొలకలు వెన్నెలలు
సక్తమైయున్న ప్రమ
స్వప్న సుఖ మెట్టిదనను.
కొండింట సక్తమై
కొండింట నంటని
ఛాయ సఖమనిగో చూడు.
మొలకలది వెన్నెలది
మొలకలు వెన్నెలలు
సక్తమై భజియించు
స్వప్న సుఖమదియె చూడు.

—:o:—

స్ఫురణ
నరసాపురం.

రచన
2-10-22.

# ఆరు బయట.

గీతిక. 9.

భారసుస్థిరములై - కారు చీకటందు
ఎత్తు దున్నలట్టుల్ - మత్త గజములట్టుల్
దోఁచు పర్వతములన్ - వీచుచల్లగాలిన్
బఱగు నాకసమునన్ - గొఱలె చిన్ని చుక్కల్
దూరమందుత్తరం - బారయలో 'మన్నెం'
తొలకరి మెఱపూనెన్ - కలకాలపుఁజూపై
ఆరు బయట పల్లెన్ - ఏరే - నది సుఖమో
మడతమంచమందున్ - బండుకొంటి నొంటిన్
చెంత పేద యిండ్లన్ - వంత బాసి నట్టుల్
ఎడఁద చేతులెసఁగన్ - పడక గొనిరి గొల్లల్
వారియిండ్ల దీపా - లారిపోయెనపుడే
ప్రక్క మేఁకమందల్ - చక్క నిదుర నుండెన్
ఒకటి రెండు కుక్కల్ - వెకిలితనపుటార్పుల్
నక మొకములు విన్నఁగా - ఒకట సేయుచుండెన్
నాదు మనమునాడై - ఖేదసౌఖ్యములు లే
కేదైనపు దయనో - సోదరసమమందెన్
చుక్క జూచులోనఁగా - చక్క గాలివీచెఁగా
ప్రక్క దిరుఁగు నంత - టక్కరి మెఱపడరెఁగా
ఆరు బయట హాయో - ఆరేనది మాయో



స్ఫురణ, కణుపూరు. రచన, 15-6-20

# మాతృలాలనము.

గీతిక. 10

దిరిసినచెట్టు పూలుపైని - పాలవెల్లిచిలుకలుగా
దాసిలచ్చి చిన్నబిడ్డనిన్
ఈతాకులచాపపైని - తనదుగుడిసెముంగిటన్
బట్టబయటఁ బండఁబెట్టెను
ఎదరింటివారిసేవ - సేయఁబోలుదాసిలచ్చి
ఆయింటిల్లాలుపిలువ - లచ్చితనదుగుడిసెనుండి
వెలికివచ్చిదారిలోని - బిడ్డనొక్కమాఱుచూచి
యిట్టెయెత్తిముద్దుబెట్టి - ఆపుకోరవత్తునంచు
వెడలినదగ వేగ వేగ -

పేదరాలి వైభవంబు -

ఆలాలన మనతికాల - మాత్రమయ్యు నందగించె
పట్టుకుచ్చులట్టుపూచు -
అలశిరీషకుసుమాంచల -
సాంధ్యరాగసమయమెంతసన్

స్ఫురణ. రచన,

రాజమహేంద్రవరము, 2-2-1922.

# హాయి! హాయి!

## గీతిక. 11.

దవుదవ్వుల నదీతల ప్రసీమల పులకితస్పర్శ
అపిరళ సుందరమయ్యెన్
చివురుచెట్ల చలనమునను - రవళినుంతసుంత గొలిపి
మరుదంకుర మొక్కసంజ - కనిపించెను గౌతమిపై
ఉక్కపోతనున్న నాకు - చక్కనొప్పె దానితగుల
మెంత మెల్ల మెల్లగనది - మైతగిలెనో హాయి! హాయి!
మలయశీతలంబగుచు - మందమగుచు మధురమగుచు
నాసనూర్పులందుగలిసి - నాదుజీవనంపు- పవన
వాహినినొకటౌచునొప్పి - నన్నుడాసినన్నుదాటె
ఎన్నరాని నది కెదురై - సంద్రముకడనుండివచ్చె
చక్కనై ననుంతగాలి :
ఎంత మెల్లమెల్లగనది - జమడెంచెనో హాయి! హాయి!
ఎంత చల్లచల్లగనది - మైదగిలెనో - హాయి! హాయి!

స్ఫురణ,
నరసాపురము.

రచన.
20-8-1922.

# విశాఖ సంద్రపుటొడ్డున

## గీతిక. 12.

కుఱ్ఱవాండ్రు పఱుగు లెత్త
ఎఱ్ఱపీత కేలఁ ఛితి?
ఇంపుగొలుపు సంద్రమా!
నీదు తీరమందునన్

పల్లెవాండ్రు వలను ద్రిప్ప
మీలకేల మిడిసిపాటు?
సొంపుజూపు సంద్రమా!
నీదు తీరమందునన్.

పచ్చకొండ ప్రక్కఁ నిలువ
నురుగుటలల విఱుగు లేల?
ఓ విశాఖ సంద్రమా!
నీదు తీరమందునన్

ఎన్నిసార్లు నిలుతుని
నెంతసేపు తలఁతునో
ఓ! అపార సంద్రమా.
నీదు తీరమందునన్.

---

స్ఫురణ,
విశాఖపట్టణము.

రచన,
11-5-1921.

# జీవనమను దారిలోన

## గీతిక. 13.

జన్మమనెడి జనకుఁడునను
కేరుమనఁగ బారుమనఁగ
మృత్యువనెడి యొజ్జకడకు
పంపఁజూచెడిన్ — కాని
మంచిపిల్లవాఁడనో? చెడ్డపిల్లవాఁడనో?
జీవనమను దారిలోనఁ జెలఁగియాడుచుఁగ్

జన్మమునకు దూరమగుచు
మృత్యువునకు దొలఁగిచనుచు
జీవనమను దారిలోనఁ జెలఁగియాడుదున్
తండ్రియొజ్జకడకుఁబోయి-నన్నుఁగూర్చిప్రశ్నవైన
ఒజ్జనన్ను నెమకినెమకి-నాకునెల్లనచ్చఁజెప్పి
తండ్రికొప్పజెప్పెడిన్-నాఁడె
మంచిపిల్లవాఁడనో చెడ్డపిల్లవాఁడనో
జీవనమను దారిలోనఁ జెలఁగియాడెదన్.
తెలివితక్కువో
నిలుచుమక్కువో?

---

స్ఫురణ, రాజమహేంద్రవరము.

రచన, 3.3-20.

# చిన్ని చుక్క

### గీతిక. 14.

“చిన్నిచుక్క-మున్నిరాద-కంటినలుసు-కంటెజిన్నఁగు-
కాంతివెలయ-వింతఁజూతు-నాశిరమున-భాసిల్లుదు
దూరమయున్-జేరికయన-నీకునాకు-నాటంకం
బేమిలేదు-ఏమిలేదు-మంచుకొండ-మఱుగులేదు
అబ్ధియలల-యడ్డులేదు-గోడలేదు-గొడుగులేదు
చెట్టులేదు-పుట్టలేదు-కానినీదు-కాంతికతన
కాంచకుంటి-కనఁబడవుగ-కరయుగళికి-వాలుకనుంటి
నిన్నుజేర-నేరకుంటి-ఒక్కతీరు-చక్కఁగాను
చిన్నిచుక్క-వెలఁగుడపుడు-ఎందుఁబోదు-వెందుఁగందు
అడ్డపడదు-నదియుదేమి?-తేటచుక్క-తెలుపుమిందు”
“పోనెచటికి?-రానెచటికి?-పోనురాను-పూరుషుండ!
కాఁచవాక్కు-ఘనమగుసగ-లందునన్న-నందపడుట
ఐక్యమగుట-లెల్లెయుంట-” “అడ్డపడున-దంతకల్ల
అగపడు పగలాయటంటి-పగలయ్యెక-దొంగముడిగెక
తొంగరుపొద్దు-సొగసుడిచె-ఎల్లవెలుగు-ఏకమయ్యె
నాకంటికి-నేదియడ్డు-లేకపోయెఁ-జీకుతప్పె.
అల్లచుక్క-నెల్లమఱచి-అహాహా! తెల్లవారెనంటి.

స్ఫురణ, రచన.

రాజమహేంద్రవరము. 20-1-1919.

# ఒక మనస్థాయి

## గీతిక 15.

పలుమాఱు మనసున కోక - ప్రణయంపుఁ బలుకుతును కో
ప్రేమ పూరితపుఁ బలియో - మధురగాన భరితమనన మో
నడకనో మఱి మన్నకనే - పండుకొన్న విశ్రాంతినో
కలనో యుదయపు వేళ - మెలకువ గొనుతొలి తఱినో
మొదలు తుదను దోపింపక - ఎవకుదట్టి పెదవులపై
నుదయింపంగను జేయున్ - కొదమనవ్వున్-హా! అవ్యక్తమొ!
ప్రియురాలెవ్వతె యనుకో - దయితుండెవ్వఁడో తలఁపన్
ఏవిదూషకుఁడోకనబో - స్థూలదృష్టి మఱేదో చదుగా
లీలగన నదియెచనుగా - కాలములో వెనుఁబడుగా
ఆనడకనె ఆశాంతినె - ఆకల నా మెలకువనే
అల్లే పెదవుల నడుమనె - మటుమాయంబగు నవ్వు
నవ్వ నల్లై యుండునుగా - నవ్వనల్లై యుండునుగా.

---

స్ఫురణ, రచన,
నరసాపురము. 3-2-24.

# నదికడ.

## గీతిక 16.

నదిలోన ఱెల్లుదుబ్బు-నవ్వుచుండెఁ దెల్లపువ్వుల
నదికావల-ప్రొద్దుకుంకు-ప్రేమగొలిపి నెఱ్ఱజిగుల
నదికుత్తరమందు గిరుల-మెఱసె మొగులు కఱవుదీఱ
నదికిదక్షిణమునలంక-లొప్పుచుండెనొక్క-పచ్చ
నదికీవల నేను మదిని-ముదము గదురనిలిచియుంటి
నదినాఁడు నాకనుల-నవ్యశోభ నందగించె
నాముందఱ గోదావరి-నాకధునీచిత్రమయ్యె
అలల పోవు చిన్నిపడవ-నరసితిగద అచ్చెఱఁబతె

---

స్ఫురణ,
రాజమహేంద్రవరము.

రచన,
17-10-1924.

# పెద్దనవ్వు

గీతిక. 17

ఆవనుండి జీవనదిగ - జాలువారు ఊటనీట
తాటి పట్టివంతెనకడ - రేవులోన- బచ్చగడ్డి
తడుపువేళ పకపకపక - పట్టరాని నవ్వునగిరిగా
పొట్టపగులు నవ్వునగిరిగా-
మాలపడుచు లంగడ్డిలో - గడ్డిమోపు బిమ్మకొనెను
ఆడుపడుచులా పొలములు - గడ్డికోసి నడ్డిజోలి
వైచుకొనెను పేదపడుచు - లొక్క పటికనక్కయున్న
కొడవలి వడికోసి కట్టు - చీనుగొనెను ఒంటిపడుచు
లావనుండి జీవనదిగ - జాలువారు సన్ననీట
తాటి పట్టివంతెనకడ - రేవులోన- పచ్చగడ్డి
తడుపువేళ పకపకపక - పట్టరాని నవ్వునగిరిగా
పొట్ట పగులు నవ్వునగిరిగా -
ఎచట నుండి అంతనవ్వు - పడుచులకును వచ్చినదో
తలనెత్తరు పలుకాడరు - పొలము నడుమ-కొడవలితో
నిలువునున్న గడ్డికోయు - కోలంను కనుమూతలిడుదు
రెదుటనున్న ఎత్తుకొండ - చుట్టుచున్న నిట్టతాళ్ల
వారిపసులవ్వారిగాయ - మాధుర్యమూనుమాలపడుచు
లంత నవ్వు నెట్లు నవ్విరో?-

ఎవరి చేనిలోని గడ్డో
ఊటకాల్వ ప్రక్కదనఁగ
నూటకాల్వలోన దగిపిరి
ఎండఁబడిన శ్రీమల మఱువ
చల్లనీట నొడలు కడిగిరి
ముందు లాభమెంచనట్లు
చీరచెఱఁగు వారు దులిపిరి
మూఁడుపూలు ఆరుకాయ
లాభముల కింక కాక
ఏలచింత ? ఏలభాగ్యము ?

స్ఫురణ,
రాజమహేంద్రవరము.

రచన,
3-3-1922.

# బాతులజంట

## గీతిక. 18.

నిండువఱదలో నిద్దపుజంట
ఉద్దిగ నీఁదెడు ఒఱపుల జంట
పరవపు ముద్దుల పక్షులజంట
పరిశుభ్రపుఁ దెలివన్నియ జంట

ఆకాశముపై సందపుమబ్బు
నీటిని మోసెడు నీలపుమబ్బు
చల్లనిగాలికి సాగెడుమబ్బు
మబ్బులనీడల మసలెడుజంట
బాగులదూఁగెడు బాతులజంట

ముక్కులసీరము పండెడుముక్కు
రెక్కలసర్దెడు ప్రేమపు టెక్కు
రాలవిసర గట్టెక్కెడుటెక్కు
ఇంటిచూపుచను ఇంపులచొక్కు
చక్కని బాతుల సరిపడుజంట.

ఎంతమోహనపు వీక్షణసుఖమో
ఎంత శాంతమగు ఇష్టార్థంబో
ఇంతకు నంతకు నిలనవి రెండే
జంటగనున్నటు చాయఁదోఁచె

స్ఫురణ,
నరసాపురము.

రచన,
8-9-22.

# ఓ బయ్యా! ఓ బయిత!

## గీతిక. 19.

ఓబయ్యా! ఓ! బయిత! సొరకాయ కోతలు కోయకురా!

రాతిరిఁ జాబిలివలవేసావా ?

రొయ్యాకు మీసము జూసావా ?

నలుగుబొంతలు తేల్చావా ?

వాలుగు పొడవులు కొల్చావా ?

[illegible] పాతావా ?

[illegible]తలగంపెడు నెత్తావా ?

గాలమువాడిగ గుచ్చావా ?

అలికిఁ జేపలఁ దెచ్చావా ?

ఓ! బయ్యా! ఓ బయిత! సొరకాయకోతలు కోయకురా!

స్ఫురణ, రచన,

నరసాపురము. ?

# ప్రాణికోటి బ్రదుకుసందడి.

గీతిక. ౭౦.

పడవనీటఁదేలి నడువ
పడవలోనఁ బండుకొంటి
కూర్కులోన కోర్కెవింటి
పడవక్రింద నీటిరుతము
బండిబాట వడిగదోల
గడుకొయ్యను జేర్లబడుచు
ఒక్కకునుకు పాటులోన
వింతపంటెఁ జక్రరవము
లోకయాత్రలోన సతము
ఆకసంబు నరసికొనుచు
శాంతతన్మయుండనుగ
చెప్పులబండువుగను వింటి
ప్రాణికోటి బ్రదుకుసందడి.

---

స్ఫురణ,
నరసాపురము.

రచన,
10-7-1922.

# చరణసూచిక.

# సమాప్తిశ్రుతి.

గీతిక అయిపోయె
ఇంక మిగులునదేది?
గీతిక కోసదుతమేగా
అంతరాళమందు
శాంతమలయపవనో
దంతమగుచు - వినుచు
అదిగో!
నిశ్శబ్దపుటాత్మన్
నిక్కపు తొలియూహన
వలయితసుశ్రుతి
నదిగో!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## గమనిక.

కొండకొలను శిశసితోత్పల

100 గీతికలుగల
మొదటి సంపుటమింతటితో ముగిసినది.
ఈపైనుండి 100 ఊహాలుగల
— రెండవ సంపుటము ప్రచురింపఁబడును. —

అందలి మొదటిపొత్తము,
ప్రకృతిచందనము.

24



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 109 B 141 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | VI, VIII, 34, 42, 44, 22,1.2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | naveen |
| పరీక్ష చేసినది | ASWINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |